సంపుటము 5] జూన్, 1919 [సంచిక 12

# బాలమిత్ర

## సోమరితనమునకు ఫలితము

సోమరితనమువలన అన్నిపనులు కష్టమగును. గాని పాటుబడుటవలన నన్నియు సులభమగును. ప్రొద్దెక్కి లేచువాడు దినమంతయు త్వరపడుచుండవలెను. ఎంత తొందర పడినను కార్యములేదు. చీకటిపడకముందుగా తన కార్యము నెరవేర్చుకొనజాలడు. సోమరితనముగా నుండి యెంత మెల్లగా జరుగునప్పుడు, బీదరికము త్వరలోవచ్చి కలిసికొనును.

# ఊబిరాజు కుమార్తె



పూర్వము దూరదేశమం దొక భయంకరమైన ఊబి యుండెను. అక్కడ నల్ల నీరుగల వ్యసనకరమైన కోనేరులుండెను. భూమి మెత్తగాను తడిగా నుండెను గనుక యెవరైనను దానిమీద నడుచుటకు ప్రయత్నించినయెడల, యడుగు పెట్టుటకు నే స్థలము లేకపోయినందున మునిగి చనిపోవలసియుండెను. అక్కడ సొగసైన రంగుగల పువ్వులు లేవు గాని చెడ్డవాసనగల పుట్టకొక్కులును జిగటగా నుండిన చెట్లును పెరుగుచుండెను. రాతియందు కప్పలు అఱచుచుండెను, పగటివేళకూడ సూర్యకాంతి లేదు గనుక, యంతయు దుఃఖకరముగా నుండెను.

అక్కడిరాజు ఒక్కొక్కప్పుడు మనుష్యరూపమును ఒక్కొక్కప్పుడు పెద్ద కప్పరూపమును ధరించుకొన్న యొక

భయంకరమైన దేవత. అతడు చెడ్డగుణముగలవాడై యొక పాటసారి యా యూబియందు తన ప్రాణము పోగొట్టుకొని నప్పుడు సంతోషించినవాడై యుండెను.

ఒకనా డొక పిల్ల తన యింటిలోనుండి పుష్పాలు తెంపుటకు పారిపోయి, యడవియందు తిరుగుచుండగా నా యూబి చేరినప్పుడు, యూబిరాజు అకస్మాతుగా కనుబడి, యామెను పట్టుకొని బురదక్రిందుండిన తన నగరమునకు తీసికొనిపోయి, ఆమెను పెండ్లిచేసికొనెను. అక్కడ ఆమె యూబిరాణియయి నప్పటికిన్ని, ఆమెకు నేమియు సంతోషము లేకపోయెను. కొంతకాలమైన తరువా తామెకు నొక ఆడపిల్ల పుట్టినప్పుడామె బలహీనయై చనిపోయెను.

ఆ పిల్ల పెరుగుచుండగా పగటియందామెకు తన తల్లివలె సుందరమైన శరీరమును, తన తండ్రివలె చెడ్డగుణమును కలుగుచుండెను. రాత్రి వేళలో రాజుశరీరము కప్పరూపమునకు మారినవిధముగా నామె శరీరముకూడ మారెను గాని, యామె తల్లికి కలిగినటువంటి దయగల గుణ మామెకు పట్టుబడెను. ఒకనా డామె దూరముగా తిరిగి అలసటచేత నొక చెట్టుక్రింద నిద్రించుచుండగా నొక (బెస్తవా) డామెను చూచి ,, ఇదిగో, ఒక తప్పిపోయినపిల్ల నే నామెను కాపాడవలెను,,ని తలంచి యామెకు తన యింటి కెత్తుకొనిపోయి, యా సంగతి తన భార్యకు చెప్పెను. వారు నిద్రించుచుండిన

పిల్లను తమ మంచముమీద పరుండబెట్టి, చీకటిపడినందున భోజనముచేసిరి. అప్పుడు వారు పిల్లనుచూచుటకు తిరిగివచ్చి యామెకు బదులుగా నొక గొప్పకప్పను యక్కడ చూచిరి. ఆ కప్ప దిగి ఇంటిమూలయందు కూర్చుండెను. వారు "పిల్ల యింటికిపోయినదేమో" యనుకొని పండుకొనిరి. అయితే మరునాడు వారు లేచినప్పుడు ఆ కప్ప కూర్చుండిన స్థలమందా పిల్ల కనబడెను. ఆమె లేచి, వారిని చూచి "తినుటకు నాకేమైన నిమ్ము" అని మూర్ఖముగా నరచెను. ఆ స్త్రీ దయతో నామెకు నన్నము పెట్టి, ఆమెను "నీయూరు ఎక్కడ నున్నది? నీ తండ్రి యెవర"ని యడిగెను, అయితే యా పిల్ల యా మాటలు గమనించక, ఇంట్లో నజాగ్రతగా తిరిగి రెండుకుండలను పగలగొట్టి, యా దయగల స్త్రీ యొక్క చేతిని కోపముతో కొరికెను.

ఈలాగు కొన్ని సంవత్సరములవరకు నా పిల్ల యా బెస్త వాని యింట్లో నుండుచుండెను. పగటివేళ తన చెడ్డగుణముల వల్ల నింటిపని బాగుగాచేయక, అమర్యాదగా నడుచుచు, వారియొక్క దయకు అపాత్రురాలుగా నుండెను. రాత్రి వేళ యామె వికారమైన కప్పరూపము ధరించుకొనినప్పటి కిన్ని నామె గుణము మారిపోయినందున వారియొద్దకు ప్రేమతో వచ్చి, "మీరు నాయెడల చూపించిన దయ విస్తారము

గనుక మీకు ననేక వందనములు చెల్లించు బాధ్యురాల" నన్నట్టు మెల్లగా నరచుచుండెను.

కొంతకాలమైనప్పుడు దొంగలగుంపు యీ యూరిమీదపడి యీ సుందరమైన యూబిరాజు కుమార్తెనుచూచి యీమెను పట్టుకొనిపోయిరి. వారు దూరముగావెళ్లి తమ ఊరు చేరుచుండగా నామె కప్పగా కనబడెను. దొంగలుచూచి విసికిపోయి, మరునాడామె తిరిగి పిల్లయైనప్పుడు "సందేహము లేక ఈమె దేవత"నుకొని, యీమెకు హానిచేయలేదు.

ఒకనాడు దొంగలు దొంగిలబోయి, యొక మనుష్యుని పట్టుకొని తిరిగి తెచ్చిరి. ఆ సమయమున వారి దేవతయొక్క పండుగదినము గనుక వారు "రేపు యీ మనిషిని దేవతకు బలిగా నర్పించవలెన"ని నిశ్చయించి, యతనిని చెరసాలయందు వేసిరి. యీ యూబిరాజుకుమార్తె, యీ మాటవిని చీకటియైనందున దయగలదై, దుఃఖించెను. కాబట్టి దొంగలందరు నిద్రించినప్పు డామె రహస్యముగా లేచి చెరసాల తాళపుచెవిని తన కప్ప నోటియందు పట్టుకొని, దుముకుచు, కిటికిద్వారా చెరసాలలో ప్రవేశించి యీ మనుష్యునికి, దాని నిచ్చెను. అతడు చెవిని తీసికొని, తలుపు విప్పి స్వేచ్ఛగా పోయెను. కప్ప యతని ముందర దుమికి, అరచుచు గుఱ్ఱపుశాలకు త్రోవచూపించెను. అతడొక గుఱ్ఱమునెక్కి వెళ్లుచుండగా నా కప్ప యతనిముందరికి దుమికెను.

అలాగు వారు రాత్రియంతయు పారిపోయిరి. తెల్లవారైనప్పుడా కప్పపిల్ల రూపమునకు మారెను. ఆ మనుష్యుడామెను చూచి భయపడి దిగెను. అప్పుడామె దయలేని గుణము ధరించుకొన్నందున, "ఓ అన్యుడా! నిన్నెందుకు రక్షించినాను. తిరిగి దొంగలను పిలుచుతాను"ని కోపముతో చెప్పెను. అయితే యా క్రైస్తవుడైన మనుష్యుడీమెను దయ్యమొకటి పట్టుకొనియున్నదని గ్రహించి, మోకాళ్లమీద పడి, ఆ పిల్లనిమిత్తము సంపూర్ణమైన మనస్సుతో ప్రార్థన చేసెను. అందువల్ల నామె తండ్రియైన యూబిరాజుయొక్క శక్తి తగ్గిపోయెను. అప్పుడాయ నామెను గుఱ్ఱముమీద నెక్కించి, కళ్లెముపట్టుకొని, తన గ్రామమునకు నడిపించెను. అప్పటినుండి కప్పరూపమును ధరించుకొనక తన తండ్రియొక్క గుణమునుకూడ వదలిపెట్టెను. కాబట్టి వారిద్దరు పెండ్లిచేసికొని సుఖముగా తమకాలము గడిపిరి



*

# బాలికా విషయములు

నీళ్లు మాకు కావలె నీ లోతు బావి। నీళ్లు మాకు కావలె నింపైన పొడుగు త్రాడువేసి (బావిలోనికి త్రాడువేసినట్లు చేయవలెను) యీ బావిలోనినీళ్లు మే మందరం బిట్లునిట్లు గుంజుదుము (తాడుగుంజి నట్లు చూపవలెను)

2. కుండలోని నీళ్లలో (చేతులతో కుండ ఉన్నట్లు చూపవలెను) బియ్యంబుబోసి (నిజముగా పోసినట్లు చేయవలెను) కరముతో వానికడిగి (కడిగినట్లు చేయుట) తగుపాటి నీళ్లతోడ పొయిమీదబెట్టి దాని (పొయ్యియున్నట్టు పెట్టినట్లుచూపుట) నన్నంబగువరకు నిట్లు మంటబెట్టుదుము (మంటబెట్టినట్లు చూపుట)

3. కష్టంబులేక నీళ్లతో మేమనుదినంబు। కాళ్లుచేతు ల్ముఖము (ముఖము కాళ్లుచేతులు చూపుట) కడుగు టయేగాక అనుదినపుస్నానంబు (నీళ్లుమీద పోసినట్టు చేయుట) విద్యకన్న శ్రేష్ఠమని యిట్లు చేయుదుము (పుస్తకమున్నట్లు చదివినట్టు చూపుట)

4. నీళ్లు లేకపోయిన (నీళ్లులేనట్లు చేతులుచూపుట) మా చిన్న చెట్లపువ్వులు నాశమగును (చేతులలో చెట్లు చిన్నగనున్నట్లు చూపుట, పువ్వులున్నట్టు

వాసనచూచుట) చిన్నిచిన్ని మొక్కలన్ని (చేతులతో చూపుట) చెరువునొందకుండునట్లు చేరి మే మందరము (అందరు గుంపుకూడుట) నీళ్ల నిట్లు పోయుదుము (చేతులలో కుండలున్నట్లు చెట్లకు నీళ్లుపోసినట్లు అందరుచేయవలెను.)

---

# దుష్టసాంగత్యమువలనవచ్చు కీడు

ఇఫ్రాయిం, దానియను యిరువురు బాలురు కొన్ని సంవత్సరముల క్రిందట ఒక మగపిల్లల బోర్డింగులో యొకటేతరగతి జదువుచు, సమానవయస్కులై యుండిరి. ఈ దిగువ జెప్పబడబోవు సంగతి జరిగినప్పుడు వీరిరువురు 2 వ ఫారమును జదువుచుండిరి. మొదటివాఁడు (ఇఫ్రాయిం) తెలివితేటలుగల బాలుడుగాని శుద్ధపోకిరి. సులభముగా స్తోత్రపాతులకు లొంగువాడు. రెండవవాఁడు పిరికిబంటు. వీరిరువురు ప్రాణస్నేహితులు. ప్రతి సెలవు దినమున వీరు కలసిమెలసి బజారునకుగాని తేనతిట్టెలను తినుటకుగాని వెళ్ళుచుండెడివారు.

ఇట్లుండ యొకనాటి వేసవికాలంబున వీరిరువురును గలిసి కొంచెము పెద్దవాడయిన అనఁగా 4 వ ఫారములో చదువు



చుండిన సదానందమను బాలుని యొద్దకేగి యేమండీ? "సదానందముగారూ! అబ్బొబ్బొ! యేమి తేనె తెట్టెలండి. మేమిరు పురముతిని యెక్కువైనది, గొడ్డనుమేపు బాలురు బాలికల కిచ్చుచుండువారము. మీరు వచ్చిన మీకేమి పనినియ్యకయే మేమిరుప్రరము మీకు కావలసినంత తేనె నిచ్చెదము. రండని పిలచిరి. ఆ బాలుడు మొదట వారివెంట బోవుటకు శంకించి నను పిదప వారి మాయ మాటలకు లొంగి వారివెంట బోయెను. వీరు మువ్వురును గలసి బోయిపోయి తుదకొక స్మశానస్థానమునకు జేరిరి. అచ్చోటు బహు భయంకరముగాను నిర్జనస్థలమై యుండెను. అచ్చట వీరు బహు భీతిజెందినను, ఆ స్మశానభూమి కతిసమీపములో యొక మామిడి తోపు కన్నులపండువుగా వారికి గాన్పింపగా, ఇఫ్రయిం యనునతడొక చెట్టెక్కి పండ్లను గోయుసమయంబున వారి వీనులకొక భయంకరమైన పిడుగువంటి శబ్దము వినబడగా వారు వెర్రికోతులవలె భయాపీడితులై యుండ అస్సలు దొంగ అనంగా పండ్లనుకోయువాడు చెట్టుదిగి పరుగిడెను.

మిగిలిన యిరువురితో తోటకాపు ఆ పండ్లను కోసికొని పోయిన వానినిగూర్చి చెప్పుచూ వారిని ప్రేమతోబిలిచి యూదా కాని క్రీస్తును ముద్దుతో అన్యులకు అప్పగించినట్లు యా తోటకాపు వీరి నాదరించినట్లుగా కొన్నిపండ్లనుఁగోసి వారిరువురు ఒడిలోఁ బోసి తుదకు వీరే నాపండ్లను గోసిరని గ్రుడ్డెఱ్ఱజేసికొని రండి కోర్టుకుబోదమని వారిని వెంట గొనిబోవుచుండ మధ్య మగపిల్లల బోర్డింగ్ వారికి తటస్థముకాగా వారిలో నొకడు తప్పించుకొనిపోయి. జరిగిన వృత్తాంతమును ఆ బోర్డింగ్ అధికారికి దెలుపగా వాడు దయతో తమ బొట్లేరను పంపగా వాఁడు ఆ మిగిలిన వానిని సులభముగా విడిపించి వారిని దొరసానిగారి యొద్దకు బంపగా వారు దయతో వీరికితగు న్యాయమునుదీర్చి ఆ పండ్లను కాపును తీసికొని పొమ్మనగా నతడు ‹‹ నాకువద్దు. కోసినవి నాకెందుకు ›› అని తిరస్కారముజూపి పండ్లను విడిచిపోగా, అస్సలు కోసిన వాఁడు క్రమ క్రమేణ వాని నన్నిటిని తినివేసెను. ఇప్పు డతను పంతులుపని చేయుచున్నాడట.

-------

# బుల్లెఱ్ఱి కుళ్లాయి

అనగనగ ఒక ఊరు. ఆ ఊళ్లో ఒక ముసలిది. ఆ ముసల్దానికొక కూతురు. ఆ కూతురుకొక చిన్నపిల్ల. ఆ పిల్ల చూడ చక్కని చిన్నది. అంత చక్కని చిన్నది ఆ ఊళ్లోగాని ఇంకొక ఊళ్లోగాని కనపడలేదు. అందుకని ఆ ఊళ్లోవారంతా ఆ పిల్లని చాలా ప్రేమించారు. మరీ ముఖ్యంగా ఆ ముసల్దానికి ఆ పిల్లంటే బహుప్రాణం. తన దగ్గరుండే చిన్నదమ్మిడీకైనా ఏదైనాకొనిపెట్టేది. ఏ బట్టలోడు బట్టలుతెచ్చినా వాని దగ్గరనుండే మంచి వాటిని కొనిచ్చేది. ఒకనాడు ఒక హాకరు ఎర్రటి కుళ్లాయి తెచ్చినాడు. దానిని చూచి ఈ పిల్ల బలే ముచ్చటపడినది. అందుకని ముసలిది ఆ కుళ్లాయికొని ఆ పిల్లకిచ్చింది. ఆ కుళ్లాయి పెట్టుకున్నప్పుడాపిల్ల మరీ యందంగా కనపడేది. చూచేవారంతా బహు ముచ్చటపడేవారు. ఆ పిల్ల అంత పొడగరికాదు. లావాటిది కాదు. చాల చిన్నగా నుండేది. ఈ ఎర్ర కుళ్లాయి పెట్టుకొంటే గమ్మత్తుగా నుండేది. గనుక వారామెను "బుల్లెఱ్ఱి కుళ్లాయి" అని పిలిచేవారు.

ముసలివారికి బహు రోషము గనుక ఒకనాడీముసలిదానికి కూతురుమీద కోపంవచ్చింది. అందుకని అలిగిపోయి



అడవిలో గుడిసె వేసికొని అందులో కాపురముండెను. ఎంత బతిమాలినా రాలేదు. గాన అడిగి ఆడిగి అందరికీ వినుకుపుట్టినది. దానికూతురు ,, పోతేపోయిందిలే ముసిలిది,

ఇంతేచాలు. ముసిలిగోఁబుగు ఇక ఉండదు" అని అనుకొన్నది. గాని బుల్లెర్రకుఱ్ఱాయి అవ్వమీద దిగులేసికొన్నది. కొన్నాళ్లయినపిమ్మట తల్లితో "అమ్మా! అవ్వదగ్గరకుపోతాను. పోయి చూచి వస్తాను" అనెను.

తల్లి.—"ఎందుకే ముసిల్దానిదగ్గరకు!"

ఎర్ర.—"దానికి ఒంట్లో బాగాలేదట. ఏమయినాయిస్తే పట్టుకొనిపోతాను."

తల్లి.—"సరే అట్లయితే ఈ రొట్టెలు, కుడుములు, పండ్లు పట్టుక పో. పోతే పొయ్యావు గాని, దోవలో మాత్రము నోఁరు దెరచి ఎవరితోనూ మాటలాడకు" మని పంపించెను.

బుల్లెర్రకుఱ్ఱాయి పండ్లబుట్ట చేతపట్టుకొనిస రేనని చెప్పి బయలు దేరిపోయినది. పోయిపోయి అడవిని సమీపించినది. ఇంతలో కొన్ని చక్కని పువ్వులు కనుపడినవి. అవ్వకని ఆయిదారు పువ్వులు కోసినది. ఇంతలో ఇంకకొంచెము దూరమున ఇంకా మంచిపువ్వులు కనపడ్డవి. కనపడేటప్పటికి, చేతిలోని పువ్వులు పారవేసి వాటిని కోయడానికి పోయింది. వాటిని కోసేలోగా ఇంకా కొంతదూరములో వాటికంటే మంచి పువ్వులు మరికొన్ని కనపడెను. అందుకని అక్కడికిపోయెను. ఇట్లా, ఇంకాకొంచెము ఇంకా కొంచెముదూరము జరుగుచు



జరుగుచు దోవవిడిచి నట్టడవిలోకి వెళ్లిపోయెను. ఇంతలో బాగా ప్రొద్దెక్కినది. బుల్లెర్రకుళ్లాయిదోవ తప్పినది. ఎంత తిరిగినా పాపము, ఏమిదోచలేదు.

ఇంతలో చెట్లచాటున తోడేలు కనుపడినది. తోడేలా పిల్లనుజూచి "బలేబలే బహుమంచిపిల్ల, ఈ పిల్లనుదినని జన్మమెందుకు? అడవిలోకెందుకు వచ్చిందో కనుక్కుందాము" అని "అమ్మాయి! నీ పేరేమి?"

బుల్లె:—"నాపేరు బుల్లెర్రకుళ్లాయి"

తోడే:—"బలే మంచిపేరుగాని ఎక్కడికి పోతున్నావు?"

బుల్లె:—"మరే మా నాయనమ్మకే జబ్బుగా ఉంటేనూ, మా అమ్మే, ఈ బుట్టలోనే, కుడుములూ, పళ్లూ, పకోడేలూ పెట్టి, ఇచ్చిరమ్మన్నది. అందుకనే పోతుండాను."

తోడే:—“మీ నాయనమ్మెక్కడ నున్నది?”

బుల్లె:—“ఈ అడవిలోనే గుడిసెలో ఉన్నది.”

తోడే ఈమాటలువిని, “బుల్లెర్రకుళ్లాయి, దానిచేతిలోని బుట్ట, బుట్టలోనిపళ్లు, పళ్లతో పకోడీలు, పకోడీలతో కుడుములు, వీటన్నిటితో ముసలిదానిని నేడు నేను పండుగ చేసికొంటాను” అని బహు సంతోషించి ముసిలిదానియింటికి దోవచూపించి, “ఇక నేను వెళ్లిపోతాను” అని చెట్లచాటుకు పోయెను. బుల్లెర్రకుళ్లాయి చాల సంతోషముతో దానికి సలాములుచెప్పి అవ్వదగ్గరకు పోయెను.

ఇంతలో తోడేలు గబగబపరుగెత్తి ముసలిదానియింట్లో ప్రవేశించెను. పాపము అవ్వ మూలుగుచుపడియుండెను. దీని ఎముకఎముకను విరిచితింటే ఆలస్యమగునని తలంచి, ఒక్కసారే ముసలిదానిని గబుక్కున మ్రింగివేసి దానిబట్టలు తాను వేసికొని దుప్పటి కప్పుకొని తలుపుదగ్గరకువేసి మంచముపై పండుకొనెను.

కొంచెముసేపటికి బుల్లెర్ర కుళ్లాయివచ్చి తలుపుతట్టి “అవ్వా, అవ్వా” అని పిలిచెను.

“ఎ ఎ ప ఆ ర ఆ ది ఈ” అని శబ్దము వినబడెను.

“నేనే, బుల్లెర్ర కుళ్లాయిని, లోపలికి వచ్చేది?”

“రా ఆ”

బుల్లెర్రకుళ్లాయి లోపలికి వెళ్లేటప్పటికి భయముపుట్టినది. అవ్వ కడుపుబ్బియుండెను. కండ్లెర్రగా మెరయుచుండెను. కాళ్లు వంకరలు తిరిగెను. చెవ్రలు నిక్కపొడుచుకొనియుండెను. గాన దగ్గరకుబోక నిలిచెను. అప్పుడాదొంగ అవ్వ “దగ్గరకురావే” యని గద్గదస్వరముతో ననెను. బుల్లి భయపడుచునే “అవ్వా నీకంత పెద్దకండ్లెందుకు?” అని అడిగెను.

అవ్వ:—“నిన్ను చూడడానికి”

బుల్లి:—“అంత పెద్దచెవ్రులు వచ్చినవెందుకే?”

అవ్వ:—“నీ మాటలు వినడానికి”

బుల్లి:—“నీ నోరెందు కంత పెద్దది?”

అవ్వ:—“నీవు తెచ్చినదానిని, నిన్ను మ్రింగడానికని” ఎగిరి ఆ పిల్లమీదబడి పట్టుకొనబోయెను. బుల్లెర్రకుళ్లాయి భయపడి, పెద్దకేకవేసి అరచెను. ఆ మార్గమునబోవు కొందరు కట్టెలగొట్టుకొనువారు ఆ సందడివిని లోపలికివచ్చి తోడేలును గొడ్డండ్లతో నరికిరి. తోడేలు పొట్టచితికి అవ్వ బయటబడెను. అంతట ఆమె బుల్లెర్రకుళ్లాయిని కౌగలించుకొని, ఆమె తెచ్చిన పండ్లుఫలాహారముదిని అక్కడ ఉండకుండా, ఊరికి మనుమరాలితోగలిసి వెళ్లెను.

C. L. S. PRESS, MADRAS—1919